నవాధమా! అధర్మపరాయణా! యుద్ధధర్మం బెఱుంగుదువే? మూర్ఛిల్లియున్న వారిని బంధించు క్షత్రియాపశదుల నే నెందు ను వినలేదు. విడుపుము. నాతో యుద్ధం బొనర్చి నన్ను గెల్వుము. లేక నాచేఁజావుము. విడువు" మనిన వసుంధరుఁడు నవ్వి "భూతద్రోహీ! భైరవా! నీకొక ధర్మముగలదటరా?

పరిత్రాతవై విడుము విడువుమని పాదములకు నమస్కరించు వారిని, ప్రార్థించువారిని, దల్లిదండ్రుల బంధువుల సుతుల సోదరులం దలంచి మొత్తుకొనువారిని నీదుష్టభైరవశిలకు బలియిచ్చునపు డీధర్మం బెందుబోయెరా దుర్మార్గా? ఆత్మ సమత్వం బెఱుంగక భూతదయలేక తమదేహాభివర్ధనమే ము ఖ్యమని తమయారోగ్యభాగ్యమే మహాభాగ్యమని యహంకా రులై గోవులవధించు చండాలమ్లేచ్ఛులవలె సర్వభూతహింస నొనర్చు జగద్ద్రోహులవలెఁ జిన్నతనమునుండి తమబిడ్డలవలె రక్షించి చెంతకు రమ్మని చిటికవేసినంతనే పరువెత్తివచ్చు కుక్కుటము లను ఛాగములను నిష్కరుణాపరులై కఱుకుకఱు కున కంఠము ద్రెంచి యామాంసముచే తమమాంసాభివృద్ధి నొనరించుకొను క్రూరనరకకూపవాసులవలెఁగాక యెవ్వరికిబా ధలొనర్పక తరువులందు వసించి నదులయందు నీరుఁద్రావి తమ కులాయంబులనే సుఖమందుచున్న పక్షులను జంపు వంశనా శకులవలె హోమధర్మ గృహస్థధర్మ అర్చనధర్మములయందు సహాయకారియై పయోదధిఘృతతక్రముల నొసంగు ధేనువుం బెంచి మదించి యున్నపు డాధేనువునాలుకం దెగఁగోసి పలు విధ వ్యంజనములను సృజించి తిని దేహంబును బెంచుకొను అధఃపతితులవలె మద్యపానమదోన్మత్తులై ప్రజ్ఞలేమి గురుల

ఘోరధర్మంబు లెఱుంగక యిచ్ఛకొలఁది వర్తించి జారచోరతతుల
కు వెనుదీయక స్త్రీలను పసుపులను హింసించి సమయధర్మ
కార్యంబునకు నేయుద్ధంబు లేక నిరాటంక మొనర్చుకొను సర్వ
లోకభ్రష్టులవలె వర్తించి ప్రాణులను హింసించి ప్రపంచమున
నెందఱిని గోడుగుడిపించితివో నీచా! చండాలా! క్రూరకర్మా!
నిన్నింతటితో సంహరింతును. వేతాళుఁడు బాధితుఁడైయున్న
యశ్వత్థవృక్షమును జేరకు నిన్నిచ్చకొనిపోఁగ యిచ్చట నిన్ను
దప్పి వేతాళుఁడు చూచుచుండ మరల నీతో యుద్ధమొనర్చ
తొలుత నేనన్నట్టు పసునైవేదనములకుఁ జచ్చునట్టు బాధించి
నిన్ను గడతేర్చెదనురా పాపిష్ఠీ! నీయందు నాకెంతమాత్ర
మును కరుణ జనియింపదు. యుద్ధధర్మోక్తులాడుటకు నీకు
నోరెట్లాడుచున్నదిరా సిగ్గులేదటరా" యని గర్జించి "ప్రవీ
ణా! యిపుడర్ధరాత్రిసమయము కానున్నది. చంద్రభగవానుఁ
డు తనచల్లనికిరణములచే మనయుల్లములు రంజింపఁ జేయుచు
న్నాఁడు. మనమింక నిట్టె పశ్చిమాభిముఖముగా నీలోయం
దాఁటి యామిట్టపై నిల్చుము. నీవంటియాశ్రమశిష్యులైన మన
వారల వేయిమంది నొకచో నిల్పియున్నానని చెప్పితివే వారం
దఱిసహాయముతో నీవియాశ్రమకుటీరములలో బలికొఱకై
తెచ్చి బంధితులైయున్న స్త్రీలను బురుషులను విడిపించి వారి
వారియూళ్లకు వారిని బోవునట్లు నియమింపుము. చార్వాక
కాపాలిక భైరవానుచరాంగనలఁ బాణములచే బాధించి యీ
డ్చుకొనివచ్చి యీపరిసరవృక్షములకు గట్టివైచి యెండుకట్టె
యలం బ్రోదిచేసి యనలంబు సంధించి యీయాశ్రమకుటీర
ములను భైరవాలయమును హింసాలయమును గాల్చి భస్మ

మొనరించువట్లు మనవారలకు నాయూనతిం దెలియఁజేయుము పొమ్ము. యావల మనముందఱను బేతాళునిసమీపంబునకుం జని యాకురాత్ముని ఖండింతు" మని గంభీరముగా నాజ్ఞ నొసంగె. నావాక్యములు భండాభైరవుఁడు విని "యోరీ కపాలభైరవా! నాసర్వసైన్యాధికారివైయుండియు నీవేనా యీయపరాధమునకు సహాయమొనర్చి నీవంటియాశ్రమశిష్యుల నందఱినొకచోఁ జేర్చి యుద్ధమున కీతనిపైన రానియ్యక స్వామిద్రోహివై యున్నవాఁడవు? కార్యాంతరాసక్తిచే యుద్ధసంరంభముచే నిన్ను గుర్తింపలేకపోయితి. నేఁడుదయమునుండి యాశ్రమశిష్యులలో నొకరైనా నాకంటఁబడరైరి. యుద్ధమొనరించుచున్నారనియే యున్నాను. నమ్మించిద్రోహ మొనర్చితివి. ఈయపరాధమునకుఁదగుఫల మందెదవు పొ"మ్మనియె. "నీవొనర్చినప్రజాద్రోహములో నిదిరోమమాత్రమైనను యనుభవించుటకు సిద్ధుఁడనైయున్నాను. ఊరక వ్రేలకి నీభైరవదేవుని వేఁడుకొనుచుండుము. ఇఁక నన్ను గపాలభైరవుఁ డనకుము. నీభైరవము నీకేయిచ్చియున్నవాఁడ. నీ కంత్యకాలఘడియలు సమీపించుచుండినను బౌరుషమును విడువకున్నావే చాలు నిఁక నోరుమూయు" మని నిరుత్తరునొనర్చి పశ్చిమాభిముఖముగా వెడలి లోయను దాఁటి మిట్టపై రథమునిల్పి వసుంధరునాజ్ఞానిర్వాహకంబునకై వీరసేనుఁడు వెడలి బంధితపురుషుల నేఁబదిమందిని ముక్తులఁ గావించె. స్త్రీకుటీరమున బంధితులెవ్వరు లేకుండిరి. కాపాలికాచార్యాంగనల రెండువేలమంది మొత్తుకొనుచుండ వారందఱిం దగుసహాయముతోఁ పాశములచే బంధించి యీడ్చుకొనివచ్చి వసుంధరుసమీప

మునం దున్నలతతరుశాఖలకు బంధించి యన్యోన్యసహాయాభైర
వాశ్రమమున కనలంబుఁ దగిల్చిన నదియును ...ల్లి ...నల
జ్వాలలచే నాంజనేయుండు లంకాపురం బెట్లు కాల్చి భస్మ
మొనరించెనో యట్లు భైరవాశ్రమంబు దగ్ధమయ్యె. నిర్ముక్త
పురుషులేఁబదిమంది యరుదెంచి వసుంధరునకు నమస్కారమొ
నరించి "మహాత్మా! నీవు సత్యసంధుఁడవు. పరోపకారదీక్షా
దక్షుఁడవు. ధర్మమూర్తివి. ఈదురాత్మునిబారినుండి మమ్ము
దప్పించితివి. ఈయాశ్రమమును నిర్మూలనము గావించితివి. ఈభం
ముని బంధించి యితనియెదుటనే యీకార్యములన్నియు నొన
ర్చుటచే సర్వవిధసౌఖ్యములు నీభైరవుఁడు కన్నులారఁజూచి
యేడ్చి చచ్చుగాక!" యనుచు యాతనియనుమతిచే వారివారి
దేశంబులకు వారు వెడలిపోయిరి. నాభైరవాంగనలు బంధి
తులై వసుంధరునికి నమస్కరించి "మహాత్మా! మేము స్త్రీజ
నులము. అస్వతంత్రులము. పురుషు లాజ్ఞయొనర్చుగతి నుండు
వారము. మేము స్వబుద్ధిచేఁ బ్రజోపద్రవము లొనర్చువారము
కాము. మమ్మేందుకు బంధించియున్నాఁడవు? పాశములు
వదలింపుము. నీయాజ్ఞాబద్ధులమై యుందుము. స్త్రీజనులకు
దయాలించుట నీవంటి సత్యమూర్తికి సహజసుస్వభావము
గదా" యని వేడుకొన్న వారలఁగాంచి మీరు క్రూరదేవతలు.
మీరిచ్చటనుండి వెడలి చేర కేరళ కొంకణ పాండ్యమండల
ములయందున్న యడవులలో సంచరించుచు నెవ్వరికి నేయుప
ద్రవములు సేయక యుండుఁడు. మీరేదియైనా బాధలు పెట్టినట్టు
మాకు దెలిసెనేని వెదకివెదకి మిమ్ముం జంపింతు పొం"డని
బంధములు వదల్చిన వారందఱు చెలరేఁగి యార్భటించుచు

వసుంధరునికి నమస్కరించుచు బొగడుచు దక్షిణాభిముఖులై
వెడలిపోయిరి. వీరసేనాదులు భైరవాశ్రమమును దహించి
వచ్చి విన్నవించిరి. ఆశ్రమశిష్యుల నందఱిని వారివారి దేశంబుల
కరుగ నాజ్ఞాపించి బాధితుఁడైన ఖేండాభైరవునితో శ్రీపాదు
నితో భువనమోహినితో రథారోహకుండై వీరసేనుఁడు
రథంబు నడుపుచుండ వసుంధరుఁడు పశ్చిమదిశానుగంతుఁడై
వెడలె. గుఱ్ఱము లతివేగముగా రథము నీడ్చికొనుచు బేతాళ
బంధితాశ్వత్థవృక్షము చెంతకుం బోయి నిలచె. బేతాళుఁ డా
ముందుదినమునుండి ప్రబలబంధనములనుండి వదలి యిటుని
టు తిరిగిచూచుటకు జేతులు పదము లాడించుటకు శక్తిగలిగి
కొంచె మానందముఁ జెందుచు దిక్కులు చూచుచుండె. వసుం
ధరుఁడు రథమునుండి దిగి బేతాళుం గాంచె. వసుంధరుని
గన్నంతనే బేతాళుని సంతోషమునకు మేరలేక "వచ్చితివా
మహానుభావా!" యనియె. "బేతాళా! చూడు మీమానవ
ద్రోహిని ఖేండాభైరవు" నని రథమునుండి క్రిందఁ బడునట్లీడ్చి
కట్లువిప్పి భైరవా! యిటరమ్ము. యుద్ధమొనర్పుము. నీకేమి
యాయుధము కావలెనో కోరికొను" మనిన ఖడ్గంబును గోరె.
యొసంగిన యిరువురు ఖడ్గధరులై యుద్ధమున కుపక్రమించిరి.
వసుంధరుని ధర్మదయాళుత్వమునకు భైరవుఁ డాశ్చర్యమొందె.
వీరసేనాదులకు భయము నాశ్చర్యము నిర్విణ్ణతయుఁ గలిగి
చూచుచుండిరి. వారిరువురు చిత్రగతులచే ఖడ్గములం ద్రిప్పుచు
ముందు వెనుకల పరుగులిడుచు హుంకరించుచు నొకచో లక్ష్య
మిడి యొకచో మొత్తుచు మండలగతిగను సంచరించుచు ఘట
ఘటశబ్దములచే ఖడ్గములం దగిలించుచు నిట్లు ఘోరయుద్ధము

సేయుచున్న వసుంధరుఁడు చెలరేఁగి సాహసబలాఢ్యుఁడై తన
ఖడ్గముచే భైరవునిఖడ్గము విఱుగఁగొట్టె మరల హుంకరించి
ఖడ్గముచే విసరె నదియు నాతనికంఠప్రదేశమునఁ దగిలి రక్తం
బు గారఁజొచ్చె. వసుంధరుఁడు తనఖడ్గమును బాఱవైచి ముష్టి
యుద్ధమున కుపక్రమించి గ్రుద్దుచు లేచుచు దుముకుచు దప్పిం
చుకొనుచు రొప్పుచు మెచ్చుకొనుచు దీర్ఘోచ్ఛ్వాసములు
విడుచుచు నిలచుచు దిరుగుచు నిర్విరామభయానకముగాఁ బోరా
డుచుండి భైరవుని ముష్టిఘట్టన లఘకమగుటచే వసుంధరుఁడు
నొచ్చియు యుక్తిలాఘవమున భైరవుని ఫాలము ముష్టిచేఁ దా
టించె. నాతాఁకున కోర్వలేక నాతఁడు స్మృతిపోయి తెప్పిరి
ల్లునంతలో నకుంభుపై మోఁది ధరణికిం బడవైచి ఖడ్గంబు
గైకొని "వేతాళా! యుద్ధచూడుము. నీప్రత్యర్థి నీయుపాసితము
నకు బలియిచ్చుచున్నా"నని గంభీరముగాఁ జెప్పుచు "భైరవా!
నీ విట్లనేగదా స్త్రీలను బురుషులను భైరవునకు బలియిచ్చు
చుండిన" దని నొక్కవ్రేటు వైచి కంఠంబు ఖండించె. నాతనిక
ఠరక్తమును దోసిలిచేఁబట్టి అశ్వత్థవృక్షముపైనున్న బేతాళుని
పై జల్లుచుండె నంత యాకసమున ననేకఘంటలు ఘణఘణ
ధ్వనులచే నిండినట్లుండె. నేమియో యని యాకాశమువంక
దృష్టినిడి చూడ దేదీప్యమానమై యొకయసమానవిమానము
వచ్చుచుండె. నావిమానమున కిరుప్రక్కల రెండురెక్కలు గల
వు. సువర్ణమయంబై క్రిందపీఠమును పైన గోపురమును గల్గి
చక్రవిహీనమైన తేరురీతిగా నొప్పారుచుండె సూర్యునివలెఁ
బ్రకాశించుచు నతివేగముగాఁ జనుదెంచి యశ్వత్థవృక్షము
చెంత నంతరాళమునందు నిలచె. భేండా భైరవునిశరీరమునుండి

యద్భుతమైన తేజము జ్యోతిరూపకంబుగా వెడలి విమానంబు
నం బ్రవేశించె. నా వెంటనే దివ్యరత్నమయమయిన కిరీట
మకరకుండలహారనూపురాది భూషణంబులు ధరియించి చతు
ర్భుజము లొప్పార అఖండతర తేజోమయమైన హిరణ్మయస్వ
రూపముఁ దాల్చి యొకయాకృతి విమానమునందుండి మేఘ
గంభీరరవముచే "వసుంధరా! నీవు పుణ్యపురుషుఁడవు. తేజో
మయదివ్యమూర్తివి. నిన్నుండి నాకు సద్గతులు గలిగె. బహు
జన్మము లెత్తి వివిధకష్టముల ననుభవించి నేఁడు నీచే వధింపఁ
బడుటచే యూర్ధ్వగమనుండనైతి. నీకీర్తిప్రతాపములం బొగడు
చు నేను స్వర్గలోకమునకుం బోయెద మహాత్మా" యని పొ
గడె. బేతాళ శ్రీపాద వీరసేనులు చిత్రప్రతిమలవలె జూచు
చుండిరి. వసుంధరుఁ డాశ్చర్యముచే "పుణ్యపురుషా! నీవెవ్వరు?
భేండాభైరవాకారమున నిట్టిక్రూరకార్యము లాచరించుచుం
డుట కేమి కారణము? నేఁడు నీవీ విమానంబున హిరణ్మయస్వ
రూపము ధరించుట కెన్నఁడు సత్కార్యము లొనర్చియుంటివి?
నీవృత్తాంత మెఱింగింపు" మనిన, "దేవా! నేను తొల్లి రవివం
శంబునం దయోధ్యాపట్టణంబున ఋతుపర్ణమహారాజునకు
మనుమండనై సుదాసుఁడను పేరుచే రాజ్యమేలుచుంటి. క్రూర
మృగోపద్రవములచేఁ బ్రజలు బాధనొంద నన్ను బ్రార్థింప వేఁ
టకై యడవికిం జని మృగములను వధించుచుఁ బ్రజోపద్రవకా
రకుండైన యొకరాక్షసుని జంపితి. వానితమ్ముని జంపక విడ
చితి. తనయన్నను జంపితి ననుచలముచే వాఁడు వంటలవాని
రూపముగా జనుదెంచి నాయింట వంటలు చేయుచుండె నది
నేనెఱుంగనైతి. నొకానొకదినమున మాకులగురుండైన వసిష్ఠ

సుహార్ధికి పాకమొనర్ప నాతని కాజ్ఞనిడితి. ఆదానవుఁడు పూ
ర్వవైరమున మనుష్యమాంసముచే శాకపాకము లొనర్చి మ
హర్షికి వడ్డించె నది యెఱింగి నాయందు కోపించి "మనుష్య
మాంసంబు బెట్టించితి వందుచే రాక్షసుఁడ వగు" మని యు
మ్మఁగ శపించె. నానిజస్థితిని దెలిసికొనక యాతురపడి నన్ను
శపించి యున్నవాఁడుగదా యని నేను ప్రతిశాపంబిచ్చుటకు
వార్చి జలముల కరపుటంబునందు దాల్చునంతలో నాముని
నానిరపరాధత దెలుసుకొని "పండ్రెండుసంవత్సరములుమా
త్రము రాక్షసుండవై యుండు" మని శాపమును మరల సవ
రించె. నదియును సహ్యాంశమే యని నేను శపించుటకు గనుకిం
పఁగా నాభార్య చనుదెంచి గురువును శపించుట ధర్మము
కాదని వారించుటచేతను నాకు మిత్రసహుండను మఱియొ
క్కపేరుండుటచేతను గోపము చాలించి శాపమొసంగక తజ్జ
లములం జల్లుటకెందు జూచినను జీవకోటిమయంబై యుండుట
చే నాపాదములపైననే జల్లికొంటి. నాజలము పడుటచే నాపాద
ములు నల్లగా కముకొని పోయె. నప్పటినుండియు నాకు కల్మా
షపాదుండను మఱియొక పేరు గలిగె. గురుశాపవశమున రా
క్షసాకారమును రాక్షసభావంబును జనియించె. నాఁటనుండి
యరణ్యములలో సంచరించుచుంటి. కొంతకాల మరుగ నొకా
నొకదినమున నేనున్న చోటునకు సమీపమునందున్న యరణ్య
మార్గముగా నొకపుణ్యాత్ముఁడైన బ్రాహ్మణుండును యతస్మ
హాసియుని భార్యయును మధ్యాహ్నసమయమై యున్నందున
ఆఁకలిచేఁ దపించుచు జనుదెంచుచుండిరి. నేనును యాఁకలిచేఁ
బీడింపఁబడుచుంటిని. యావిప్రమిథునమును జూచినంతనే తటా

లునఁ జని యాబ్రాహ్మణుని బట్టుకొని తినుట కుపక్రమించితి నాతని భార్య మొత్తుకొనుచు నీవిధముగా నన్ను బ్రార్థించె.

శా. తండ్రీ మీరు దినేశవంశజులకున్ దైవంబగున్ బ్రాహ్మణుం
డండ్రా మాటలు లేవె భూమిసుర గోహత్యాభిలాషంబు మీ
కొండ్రే మీయటువంటిసాధువులు రక్షోభావమిట్లేల మీ
తండ్రిం దాతల బూర్వులన్ దలపవే ధర్మంబునన్ బోగదే.

శా. అన్నా చెల్లెలి నయ్యెదన్ గొడుకు నీకన్నంబు వెట్టింతు నా
ప్రాణనాథున్ ద్విజు నంగీకస్త్రు నకటా హింసింపనేలయ్య నీ
వెన్నం డింతులతోడఁబుట్టవె నిజం బిట్టైన ముట్టన్ముట్టు నా
పన్నన్ నన్ను గరుణించి మతి పుత్రాప్తినీశు భక్షింపవే.

(భాగ. నవమస్కంధము)

అని కరుణబుట్టునట్లు బహువిధముగా నన్ను బ్రార్థించి నను రాక్షసభావమున నున్నవాఁడ నగుటచేఁ గరుణ లేక నా బ్రాహ్మణునిం బట్టి పులి పశువును దినురీతి భక్షించితి" నని (నారాయణ నారాయణ) యని వసుంధరాదులందఱు చెవులు మూసికొనిరి. మరల వినుఁడని నా దేవపురుషుఁ డిట్లనియె. "నా సాధ్వి భర్తమరణమునకు దుఃఖించి నన్నుగని "దురాత్మా! కామాతురనైన నా పెనిమిటిని భక్షించితివిగాన నీ వాఁడువారిం జేరి కూడిన వేళయందు మరణముఁ బొందుదువు. మఱియు నీవిప్రుని సంహరించినదోషమున నీకు ప్రబలతరమైన నరకంబు ప్రాప్తించు. యావల క్రిమి కీటక పశు పక్షి మృగాదుల జన్మంబులెత్తి యిదేవిధముగా మరణించి మరల నొకానొక రాక్షసుండవై శంబరాసురుని వంశమున జన్మించి భైరవోపాస్తి చేయుచుఁ బ్రజోపద్రవకారణుండవై యుండి యొక పుణ్యపురు

షునిచే సంహరింపఁబడి యాతనిసమక్షమున నీవు ప్రాణ
ములు విడచెద వందుచే నీసమస్తకిల్బిషములు దొలంగి రాజ
వృత్తిచే నున్నప్పు డొనర్చిన దానధర్మపరోపకారపుణ్యప్రభా
వముచే నీవు పుణ్యలోకము లనుభవించెద" వని శపించి తన
పతిశల్యములతో తా నగ్నిప్రవేశ మొనరించె. నే నాదేహము
విడచి యమపురమున నంతింతని చెప్పరాని నరక మనుభవిం
చి యనేకయోనులయందుఁబుట్టి బహుబాధలనొంది యీకీతి
జన్మించి నీదేహస్పర్శచేతను, నీసమక్షమున నే నీచేత నే సహం
పఁబడుటచేతను సమస్తపాపములనుండి తొలంగి పుణ్యపురు
షుండనై కడతేఱితి. మహానుభావా! నిన్ను పొగడుచు దివం
బున కరిగెద. మరల నరనారాయణమహర్షుల ప్రేరేపణచే
నొక సిద్ధపురుషుఁడు నీచెంత కరుదెంచి కొన్నివిషయములు
నీకెఱుంగించు నపుడన్నియును విమర్శయగును. నేనిదేపోయి
వచ్చెద. నిపుడు నీచే ఖండింపఁబడిన నాభేండాభైరవశరీరము
నందున్న హృదయమాంసము నీఖడ్గముచే బయలుపఱచి స్వ
స్తిహామంత్రముచే బేతాళునిముఖమును నడుమును పాదములు
ను దాఁకించినంతట యీబాధనములు వీడును. మరల వియన్న
దియం దీతని గూర్చుండఁబెట్టి మూఁడుమార్లు రుద్రాభిషేకం
బొనరించితి వేని సర్వవిధములైన బాధములును వదలి తేజస్వి
యగును నేనిదే పోయివచ్చెద" నని యప్సరోగణసేవితుండగు
చు నాపుణ్యపురుషుఁడు దివంబున కరిగె. వసుంధరుండు తనఖడ్గ
ముచే భేండాభైరవుని శరీరముం జించి వపాప్లీహాములు తనఖ
డ్గాగ్రమువ నద్ది బేతాళునిశిరమును నడుమును పాదములును
దాఁకించినంతనే కట్లు వీడి మహాసంతోషముచే మానినుండి

దబ్బున దుమికి వసుంధరునిచుట్టుదిరిగి ప్రదక్షిణనమస్కారం
బాచరించి పలువిధముల స్తోత్రములొనర్చె. వసుంధరుఁడు
"శ్రీపాదా! ఈదేవనదియందు బేతాళుని గూర్చుండఁబెట్టి
మూఁడుమార్లు రుద్రంబుజెప్పుచు నభిషేకం బాచరింపు" మ
నిన శ్రీపాదుఁడు నదిలోపలం దిగి శుచిర్భూతుఁడై బేతాళుని
గూర్చుండఁ బ్రార్థించి త్రివారరుద్రాభిషేకం బాచరించినమా
త్రముననే పూర్వపురీతి మహాజవసత్త్వమాయాప్రభావశక్తి
సమన్వితుండై "జయ వసుంధరావనీశా! తపఃప్రభావధురంధ
రా! భేండభైరవాంతకా! చార్వాకరాక్షసకులనిర్మూలనా!
జయీవిజయీభవ! దిగ్విజయీభవ!" యనుచు మరలమరల
ప్రదక్షిణనమస్కారము లాచరించుచు చేతులు జోడించుకొని
నిలువఁబడియుండె. వసుంధరుఁ డాతనికరములు బట్టుకొని
"భూతాధీశ్వరా! నీవింతగా నన్ను ప్రశంసింపవలయునా? నీవ
లనగదా నేనొక్కమానవుండని గణుతింపఁబడితి. నేను మాన
వమాత్రుఁడను. నీవు దేవగణంబులలోనివాఁడవు. వందనీయుఁ
డవు. ప్రశంసార్హుఁడవు" అని చెప్పుచున్నంతనే హాహాహూ
హూరావములు నలుదిశలనుండి వినవచ్చె. భూత కూశ్మాండ
వైనాయక పిశాచ మారీచ బ్రహ్మరాక్షసగణంబులు నలుది
క్కులనుండి జనుదెంచి వసుంధర బేతాళులం గాంచి చుట్టుదిరిగి
నమస్కరించి నిలువంబడి "మహాత్ములారా! మీకు భద్రమ
గుఁగాక! మీవలన మే మానీచునిదాస్యముక్తులై మరల మీ
చెంత కరుదెంచితిమి. మమ్ము జేకొనుఁ"డని విన్నవించిన బేతా
ళుఁడు వసుంధరుం గాంచి "మహాత్మా! వీరందఱు నీభృత్యులు.
వీరిచే నేమికార్య మొనర్పింపవలెనో సెలవొసంగుఁ" డనిన

"బేతాళా! వీరందఱు దమతమస్థానముల నుండవచ్చు. ఆవశ్యకమైనపుడు మనస్సునందు దలంచినమాత్రముననే మనచెంత నుండున ట్లాజ్ఞాపింపుము. వారికి సెలవొసంగియున్నవాఁడ" నని చెప్పుచు "భూతగణములారా! మీకు సెలవొసంగియున్నవాఁడ. మీయథాస్థానములకు బొం"డనిన వారు సహాజకహాకహాధ్వనులొనర్చుచు వసుంధరుం గీర్తించుచు దమయునికిపట్టులకుం బోయిరి. వాను దేవదత్తగుణ్యులం గాంచి "అశ్వరాజములారా! మీసహాయమువలన నే నసాధ్యకార్యము నెఱవేర్చి జగంబున గీర్తివహించితి. మరల నమ్మునీంద్రునిచెంతకుఁ జనుఁడు. నేనెప్పుడమ్మునీంద్రుని ధ్యానింతునో అప్పుడుమీరునాచెంతనుండుఁడు. పోయిరం"డని తీడి తట్టి ముద్దుగొని చిటుకవేసిన మాత్రముననే నాహయరత్నములు మనోవేగవాయువేగములుగాఁ బర్వెత్తుచు నెందోచనియె. వీరసేనుం జూచి "నీవు మహేంద్రవరమునకుం బోయి నరేంద్రచంద్రమహారాజుగారి చెంత మరల సైన్యాధికారము స్వీకరించి సుఖమున నుండుము. నేను రమ్మనినపుడంతయు వచ్చి నేనొనర్చుకార్యములయందు సహాయమొనరించుచుండుము. బహుమంచిసమయమునందు నాకు సహాయమొనర్చి సత్యమును సాధించితివి. నీమేలు మఱువనుసుమీ!" యని యాతనిచేతులుబట్టి యడుగుకొని షమ్మతిఁబఱచె. నతండును వసుంధరుని గీర్తించుచు నటనుండి యాంధ్రదేశమార్గముగా రథంబునందు గూర్చొని వెడలిపోయె.

"బేతాళా! కురుక్షేత్రమునందుఁగల దేవాలయముచెంత నిరువురు బ్రాహ్మణు లీభువనమోహినీ వియోగచింతాభరముచే నిడుమలు బడుచుందురు. నీవిక్కాంత నెత్తికొని యాబ్రాహ్మ

ణులవద్దనుండి రక్షించుచుందుము. నేనును శ్రీపాదుండును
నాప్రియమిత్రులగు శబరాధ్యకులం గాంచి దేవాలయముచెం
త కరుదెంతుము. ఆవల యీకాంతను వారితలిదండ్రులయొద్దఁ
జేర్చెదము పొ”మ్మనిన మహాప్రసాదమని వసుంధరునకు నమ
స్కరించి భువనమోహినీదేవి నెత్తికొని రెక్కలుగలపర్వత
మ్మాకాశమున కెగురుచందమునను, యమృతకలశముందెచ్చు
గరుత్మంతునిపిధమునను బేతాళుఁడు వెడలిపోయె. శ్రీపాదవ
సుంధరులు శబరాధ్యకావలికనాపేక్షచే నెందోచనిరి.

## నవమ ప్రకరణము. ౯.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమం దొకవిభీతకవృక్షము
తాండ్రచెట్లచే నావరించుకొని ఘోరఘూకముల కావాసమై
చూచుటకు భయంకరమై యొప్పుచుండె. నాచెట్టుక్రింద నొక
పురుషవిగ్రహము దనపరితాపము వెలికిఁబుచ్చునట్లు నతిదీర్ఘో
చ్ఛ్వాసములు సల్పుచు కాలుగాలినపిల్లివలె నొకచోనుండక
అటునిటు దిరుగాడుచు తనయుపుషులు భూషణములు దీసి
పాఱవైచుచు మరల ధరియించుకొనుచు “అబ్బా! యింకేమి
గతియో” యనుచుండె. వతఁడనిమిదడుగులు పొడుగుగల్గి బం
డికందెనవంటి ఛాయగలశరీరముతో నుండె. చంద్రనిప్పులవలె
నాతనికన్నులార్ద్రానక్షత్రయుక్తుఁడైన యంగారకగ్రహమువలె
దేజరిల్లుచుండె. నల్లనిముఖమునందు పండ్లు చంద్రకాంతపుమ
ణులవలెఁ బ్రకాశించుచుండె. ధగద్ధగాయమానంబై దివ్యమణిని
ర్మితములగు తారహారము లురంబున దాండవిల్లుచుండె. పుష్య
రాగవిరచితంబులగు కర్ణకుండలములు భాసిల్లుచుండె. స్వర్ణ

మయంబైన చిరుఘంట లేఁబడి యూతనినడుమునఁ బ్రకాశించు
చు ఘణఘణధ్వను లీనుచుండె. ముప్పదియబ్దములు వయసు
గలవానివలె నగపడుచుండె. నతఁడు తనయూరాట మిట్లు తల
పోయఁదొడఁగె. "హాతండ్రీ! నన్నేందుకు పుట్టించితివి? పుట్టిం
చితివిపో నాకీ యధికార మెందుల కొసంగితివి? ఒసంగితివి
పో నిరంకుశము లేక నేనన్న బహుజనములకు కంటగింపై యే
వగించుకొని నన్నడుగంటఁజేయఁ బ్రయత్నము లొనర్చుచుం
దురే? నాసహస్రశోతల కెక్కువకాల మొసంగియున్నను
వారు నిరభ్యంతరముగా దమయధికారము నెఱవేర్చుకొని యి
ష్టాగోష్ఠిచే నుందురు. నాకొసంగియున్న కాల మతిస్వల్పము.
దానికెన్నియో అడ్డువులు తప్పులు దిద్దుబాటులు బ్రహ్మకములు.
ఆహా! నాయధికారకాల మరుదెంచినప్పుడంతయు నీపాపిబ్రా
హ్మణులు నన్ను భ్రష్టుపట్టించుటకై యధికప్రయత్నము లాచ
రించుచుందురు. రాకరాక యిప్పుడు నాకాలము వచ్చెగదా
యని మహోల్లాసముచే తులదూగుచుండ పరీక్షిత్తుఁడను చం
ద్రవంశపురాజు చనుదెంచి నాపేరన్న సహింపక నాకెందును
యునికి గల్పింపక గొన్ని నీచస్థానము లొసంగె. నట్టిమహాత్ము
లెంతకాలముందురు? ఇట్టివారి నెందఱినో జూచియున్నాను
నశించిపోయిరి. అప్పటినుండియు నాకెదురులేక ప్రతాపమం
తయుఁ జూపితి. కసియంతయుదీర్చుకొంటి. ఇప్పుడుమరలనుత్పా
తము లనేకములు పుట్టుచున్నవి. అదిగో మందమారుతములు
వీచుచున్నవి. సముద్రుఁడు చెలరేగి మంగళతరతరంగములచే
దనయందుగలరత్నముల నొక్కటొక్కటే గడ్డకువైచుచున్నాఁ
డు. దివ్యపరిమళమిళితసుగంధబంధురం బెల్లయెడల గుబాళిం

చుచున్నది. దిక్కులన్నియు యావిరిఁబాసి స్వచ్ఛతరమై ప్రకాశించుచున్నవి. ఇట్టియపశకునము లింక ననేకములు బుట్టుచున్నవి. నేనెవరితోఁ జెప్పికొందు"నని తపించుచుండ నొకచామనిచ్ఛాయఁగల దేహముగలవాఁడు, నెఱ్ఱవారిన నేత్రములు గలవాఁడు, తామ్రములై జడలుగట్టియున్న శిరోజములు గలవాఁడు, కనుబొమలు ముడివైచుకొన్నవాఁడు, భయంకరమైన త్రిశూలమును ధరియించుకొన్నవాఁడు, మోకాలివఱకు నెఱ్ఱనివస్త్రమును జుట్టుకొన్నవాఁ డొకపురుషవిగ్రహము చనుదెంచుచుండె. నతనిఁ బరికించి "ద్వాపరా! నేఁడేల నింతయాలస్యమొనర్చితివి? వారిరువు రిటకు రాలేదుగదా" యనియె.

ద్వా:—కలీ! నాకిప్పు డేమిపనియును లేదు. వచ్చునపు డేదియో నాపట్టాభిషేకమునాఁటి ముచ్చటలు దలఁచుకొంటూ మైమఱచియుండుటచే నాలస్యమైనది కాని నీవేలమిగులసంతాపమొందుచున్నట్టు గనఁబడుచున్నావు?

కలి:—ద్వాపరా! మీరు రాజ్యమేలు కాలమున నేవిపత్తులును లేక నిరంకుశముగాఁ బరిపాలన మొనర్చుచుందురు. నేను బరిపాలించు కాలమునం దెన్నియాటంకములో నెన్నివిపత్తులో తటస్థించుచుందును. నేనెందు కీపట్టాధికారినైయుండవలయు నూరకె మునులవలె నడవులందో గుహలయందో తపం బాచరించుకొనుచుండుట మేలని దోఁచుచున్నది.

ద్వా:—ఇపుడేమివిపత్తులు తటస్థించి నీపరిపాలన కాటంకములు జరుగుచున్నవి.

కలి:—నే నేమని చెప్పుదును? నాపట్టాభిషేకమైనతొలుదొలుతనే ప్రథమచుంబనమున దంతభగ్నమన్నట్లు పరీక్షిత్తుఁడను రాజుచేఁ జిక్కువడి మూర్ధాభిషిక్తుఁడనైయుండి యుండ నునికియుఁ బండఁబడకయు లేక నఘోరించి యిపుడిపు డేదియో పుటపుటమని యొకవిధమున నారాజ్యమే నేలుకొనుచుంటిని. మరల నంతకన్న నెక్కువయైనవిపత్తు మూఁడను న్నది. అందునకు నిదర్శనముగా నపశకునములు వేనవేలు వొడముచున్నవి.

ద్వా:—కలిరాజా! అప్పుడు పరీక్షిన్మహారాజుండె నతఁడు నీచేతలు కొనసాగించియుండఁ డనుకొందమిప్పుడట్టివాఁ డెవఁడు గలఁడు?

కలి:—చెప్పుటకే భయమగుచున్నది. వసుంధరుఁడను నొక బాలుఁడు నాముఖ్యమిత్రుఁడై నారాజ్యపరిపాలనయం దత్యంతసహాయకారియైయున్న భేండాభైరవుని సంహరించె. కాపాలిక చార్వాకులగర్వ మణంచె. నిఁక క్షపణక పాషండాది నాపరిగణముల నన్నిటిని మట్టుబెట్టి నన్నడుగంటఁ జేయఁ బ్రయత్నించుచున్నాఁడే నేనేరితోఁ జెప్పుకొందును?

ద్వా:—యేమీ! భేండాభైరవుఁడు సంహరింపఁబడెనా? అంతటియసాధ్యబలుని గడతేర్చిన పరాక్రమవంతుఁ డింకెంతటి ప్రభావవంతుఁడై యుండునో నీవు చూచియున్నావా?

కలి:—చూడవలయునని నాఁడే ప్రయత్నించితిగాని భయమగుచున్నది.

ద్వాప:—కలీ! అట్లయిన కాలమొక్కరీతి గడుపవలయు నను

మాంసాస్త్రులు వినవే? ఆట్టిమహాపురుషునిపై ద్వేషించి నిప్ర
తిభ నేల పోఁగొట్టుకొనెదవు? అతుఁడు పడిన నేమిలాభ
ము? మొల్లి నలచక్రవర్తి నగచాట్లనుంచి యాతనిచే నత
నిభార్యచే శపింపఁబడియుంటివి. వేనుఁడను రాజు కాలమున
నాతని ముఖ్యమిత్రుఁడుగాఁ గైకొని యతనిచే భూమ్యా
కాశములు నిండునట్లుగా "యష్టవ్య మదాతవ్య మహో
తవ్యాం ప్రా"యనుచు డంగఁగొట్టించి ప్రపంచ మధర్మమ
యము నావించి మహర్షులచేఁ బరాభవముఁ జెందితివి.
ఇపుడిపుడే పరీక్షిత్తుచే శాసింపఁబడితివి. ఇంకెందాకు
నిరాటంకము లేనప్పుడు నిప్రతాపముఁ జూపుచుందువు.
అట్లుకలిగినా యోగాంతమొక్కరీతి కాలమును గడపుచుం
దుము.

కలి:—కాని యీవసుంధరుఁడేమి బ్రహ్మకల్పముపర్యంతము
బ్రతికియుండునా? అందున నిప్పటివారు పూర్వీకులవలె
లక్షలకొలంది వేలకొలంది సంవత్సరము జీవింతురా? ఇతఁ
డును నూఱుబదియో అఱువదియో వర్షములు జీవించును.
దేహముక్తుఁడగును నాతనకుకు తాళియుండి మరల నాప్ర
తాపముఁ జూపించెద చూడుము.

ద్వా:—మిత్రమా! వసుంధరనిర్యాణానంతర మేవిధముగా
నీవు రాజ్యమేలెదవో చెప్పుము?

కలి:—అదియంతయు నిపుడెందుకనుకొనవలయు? ఏమోకాని
నీవడుగుచున్నాఁడవు నామనమునఁగలది చెప్పెద. ప్రపం
చమునకు మకుటప్రాయమైన యీహిందూదేశమును మొట్ట

మొదట నగచాట్లయందు ముంచెద. నావల నితరదేశము
లు సర్వసాధారణము. వారలెపుడును నాకింకరులే నా
యాజ్ఞాపరిపాలితులే.

ద్వా:—ఛీ. కలీ! మనమాతృభూమిపైననే శౌలుత నీగాడి
జూపించెదవా అదియేల?

కలి:—ద్వాపరా! యింటగెలిచిగదా రచ్చగెలువవలయు?
హిందూదేశమునం దేదేశమునందును లేని వర్ణాశ్రమధర్మము
లు వేదచోదితమై యున్నవి. ఆకులకర్మనేతలు బ్రాహ్మ
ణులు. ఆపాపిబ్రాహ్మణులె నారాజ్యమును పూర్తిగా నిరం
కుశముగా సాగనియ్యరు. నాయిల నెన్నిచిక్కులు పెట్టినను
దిన నన్నమును గట్ట బట్టయును లేక మలమలమాడ్చినను
వారినియమమును వారు వర్జింపరు. నామార్గమునకు రా
రు. ఏవిధమున నైనను యీనురాత్ములను నాకింకరులుగా
నొనర్చికొంటినా యీపల మిగతవర్ణములనాకి నొక్కక్షణ
మాత్రమునసే నామార్గము బట్టించెద.

ద్వా:—అట్లయిన నీకిసాధ్యులగు బ్రాహ్మణుల నేవిధముగా
దాసులుగా నొనర్చుకొనియెదవు?

కలి:—అదియే దోంచకుండెను యోచించితి నొకయూహ తోడ
మినది. వర్ణాశ్రమాచారములులేక నొక ఉమతి మనాది
కాలమునుండి వర్తించుచున్న యితరదేశవాసుల నీదేశం
బునం బ్రవేశపెట్టుట కేదియో యొకవిధముగాం బురికొల్పె
ద. తొల్లి నలునిపై వెడలునపుడు పుష్కరునికి దేవలుండ
నువానిరూపకముగా నెట్లు బలమొసంగితినో యట్లు నా

కులగల సర్వశక్తులను వారిస్వాధీనమొనర్చెద. నపుడు వా
రరుదెంచి యీదేశవర్ణాశ్రమములపైన దాడిజూపఁజేసి
నిర్బంధపూర్వకముగా చాతుర్వర్ణములవారిని నొకేమత
మున గలియునట్లు కట్టుదిట్టంబులొనర్చి యవిధేయులయిన
వారలకు శిరచ్ఛేదనం బొనర్పించెద. ఏయేవర్ణములవారి
కేవిధముగా జనవృత్తులున్నవో యవి నిర్బంధమునఁ
దప్పించెద. అందువలన భయపడి కొంతవట్టుకు సాధ్యమ
గును. ఆవల నామతమునకు దేశీయులను వారల మఱియొక్క జా
తీయులను స్వదేశములోఁ జేర్చి తొలుత బ్రాహ్మణజీవనోపా
యములను దప్పించి వారినియమములు జరుపుకొనుట
కవకాశములేకట్లొనర్చి యుదరపోషణకేమివారుగ్ర మనశ్చింత
యందే యాపాపి బ్రాహ్మణులను ముంచెద. వివిధములయిన
సమాజములు స్థాపించి యొకరిసమ్మతి నొకరనుసరింప
కుండ నొనర్చి వారివారి బ్రాహ్మణులనే యగ్రపీఠమున
స్థాపనఁజేసి యచ్చటినుండి ద్రొబ్బి స్నానసంధ్యావందనములను మా
ఱిపించెద. పితృకార్యముల నడుగంటించెద. దైవార్చనలు
పూర్వపువారికే యొప్పించునట్లొనరించెద. ఇతరదేశా
చారములందును, యితరభాషావిశేషములందును నొక్క
వరుస గల్పించి స్వమత స్వభావ దైవభావలన్ను నొకరిం
చులాగు నొనర్చెద. కూటసాక్ష్యములకుఁ బ్రేరేపించెద.
సత్కర్మాహితాగ్నికర్మనిష్ఠాగరిష్ఠులను భ్రష్టుబట్టించి యధికార
ములఁ గూర్చుండఁబెట్టితిరేని బ్రాహ్మణులును దదాచారము
లును నామావశిష్టములగును. ఆవల తక్కినవర్ణములవారిని
బ్రాహ్మణపీఠమునఁ గూర్చుండఁబెట్టి బ్రాహ్మణద్వేషముఁ

గల్పించి సర్వవర్ణములు సమానముగుటకు గ్రోత్రక్రోత్రిగా
సమాజములు సంఘములు గల్పించి దర్శనస్పర్శనయోగ్య
లుగాని చండాలపుల్కసాదులకు గోత్రపేరులుపెట్టి పూ
ర్వపుపేరు లనుడిగించి నవీనమత మొకటి యనుసరింపఁజేసి
తక్కినవర్ణములవారితోఁ గలసిమెలసి భోజనపానాదుల జరి
పించి విపరీతజ్ఞానము బుట్టించి వారిలో మతభేదములు
గల్పించి దేవుఁడే లేఁడు ప్రపంచము తనంతట దాను బుట్టెఁ
బోవుచున్నదను నిలువ యబ్రహ్మజ్ఞానమును దృఢపఱచి
కొందఱను, క్షుద్రదైవతముల నర్చించుచు మాంసబలి నొ
సంగి జీవహింస నొనర్చువారిగాఁ గొందఱను, విష్ణుఁడే
దైవమనువారుగాఁ గొందఱను, శివుఁడే దైవమనువారుగాఁ
గొందఱను, కోటచాముండేశ్వరియే దైవమనువారుగాఁ గొంద
ఱను బ్రేరేపించి, వారికిని వీరికిని కలహములు పెట్టి యొకరిపై
నొకరికి యీర్ష్యాసూయాద్వేషములను గల్పించి గోవ
ధజీవహింసయే దైవప్రీతి యను భేదబుద్ధి గల్పించి యజ్ఞ
యాగాదులను నడిపించి యనావృష్టిరోగములచే బాధ
లఁజేసి సంహరమొనర్చి యింక నెంతకాలమునో యంత
కొనర్చి నారాజ్యము పూజ్యముగాఁ బరిపాలించెద. ద్వా
పరా! నీవడ్డగోడమీఁదిపిల్లివలె నుండుమాఁ జెప్పుసుమా!
నీకన్నియు సమానము లే. నామాటలు కొన్ని రుచించును
గొన్ని రుచింపకుండును. అందుచే నాచేయఁబోవు కార్యము
ల నితరులకు ననకుము. ఇదియే నాయోచన.

ద్వా:—కలిరాజా! యేమియో చెప్పితివిగాని ప్రధానాం
శమును మఱచియున్నావే, అందుల కేమియొనర్తువు?

కలి:—ఏమియుంతేమో నాకు స్ఫురింపకున్నది. నీవెఱింగింపుము.

ద్వాప:—ఈభరతఖండముననున్న సతీమతల్లులు నీవుగాదు నీయట్టివారు వేనవేలుమంది తమప్రతాపప్రభావములు చూపించి మోసగించినను దమసాధుత్వమును వదలువారు కారు. వారిసత్యవ్రతములు గొనసాగుచునుండెనేని పురుషులన్నత్తులెట్లు పరిగణించినను క్షణమాత్రమున సనాతన మార్గములకు దీసి నిన్నడుగంటఁజేసెదరే.

కలి:—ఆహా! ద్వాపరమా! యిందుకుగదా స్నేహితు లుండవలయుననుట. మంచిసమాచారము జ్ఞాపకముగునట్లు చేసితివి కాని యీభారతయువతులను శీలాచారపాతివ్రత్య సత్యవ్రతాదులనుండి తొలఁగించుటకు సాధ్యముకాదు. భారతాంగనలన్న దేవేంద్రాదులుసహాభయ మొందివరము లిచ్చుచుందురు. ఇఁక నేనెంతటివాఁడ? నాకెయ్యదిదోఁప కున్నది. వారల నేగతి నామార్గము ద్రొక్కింపవలయునో నీకు దోఁచియున్న నాకెఱింగింపుము.

ద్వా:—ఈవిద్యయందు నీకున్న మేధాశక్తి నాకులేదు. మిత్రమా! కోపగించుకొనక నీవే యాలోచింపుము. అంశములు మఱువకుండునట్లు జ్ఞాపక మొనర్చుచుండెద.

కలి:—ద్వాపరమా! యిపుడు నాకొకటి దోఁచుచున్నది. అదియు పెద్దవారు చేసిచూపించి నేర్పించినవిద్యయే. అందుచే భారతయువతుల నందఱిని నామార్గములో జేర్చునంతటిశక్తి చాలదు. వారు చేరరు. అంతసులభసాధ్యులు కారు

గాని కొందఱనుమాత్రము నావలలో వేసికొనియెదనని నమ్ముచున్నాను.

ద్వా:—నీయోచన యేమియో నాకు నెఱింగింపుము. ఆయోచన పెద్దవారెవరు చేసియుండిరో యదియుఁ జెప్పుము.

కలి:—తొల్లి చంద్రవంశోద్భవుండైన దివోదాసుండనురాజు కాశీదేశం బతిధర్మంబుగాఁ బరిపాలించుచుండె. నతనిధర్మప్రవర్తనచేఁ బ్రజలు దేవతల నర్చింప నగత్యమే లేకుండె. కాశీక్షేత్రమునందనవరత మావాసము గల్పించుకొనియున్న విశ్వేశ్వరాదిసమస్తదేవతలు తమ్మర్చించువారు నర్చించువారును లేక దేవతలు స్వర్గలోకమునకు విశ్వేశ్వరుఁడు మందేహారుణద్వీపమునందున్న దధిమండపర్వతంబునకుం జనియె. మఱి వారందఱు నొకచో సభచేరి యీదివోదాసునెట్లయిన రాజ్యమును వదలింపఁజేయవలయునని యెన్నియో ప్రయత్నము లాచరించిరి. కొనసాగదయ్యె. నావల శ్రీమహావిష్ణువును మహాలక్ష్మియు పాషండవేషములతోఁ జనుదెంచి పురుషులకు విష్ణుండును స్త్రీలకు లక్ష్మీదేవియు నధర్మోక్తులు బోధించిరి. అయినను స్త్రీలతిపతివ్రతలై యుండుటచే లక్ష్మీదేవి సిద్ధురాలనియు, జోగురాలనియు ననేకపేర్లఁ బ్రతిస్త్రీచెంతను నిలిచి బోధించి పాతివ్రత్యధర్మములను వర్జింపఁజేసి యధర్మపరాయణలఁగా నొనర్చె. గణపతి దైవజ్ఞుఁడై యారాజుచెంతఁ జేరి యీయుత్పాతములు బోధించి యుద్వాసనము గావించె. దివోదాసోద్వాసనమైన యనంతరము ప్రజ లధర్మమయులై తమకోర్కెలు నెఱవే

నేమియు వచింపలేక శక్తిచాలక నాతనిదివ్యతేజంబునకు వెల
భ్రాయులై చేతులు జోడించుకొని వెలవెలఁబోవుచున్నంగాం
చి "పాండు మిమ్ము నిపుడు రక్షించియున్నవాఁడ. మీరాయుధమ్ము
ల విడిచి నిరంకుశముగాఁ బ్రవర్తింపకుఁడు. అట్లు ప్రవర్తించితి
రేని శిక్షింతు" నని చెప్పె. చిత్తమని కలిద్వాపరు లంతర్హి
తులైరి. వసుంధరుం డటనుండి దక్షిణాభిముఖుఁడై వచ్చుచుండ
నాతని కెదురుగా మహావేగముగా గత్తిఁబట్టుకొని ప్రజ్ఞలేక సొమ్మ
సిల్లుచు పరువెత్తి వచ్చుచుండె. సమీపమునకుం జనుదెంచె.
పరికింపఁగా నీరుసితాపుల కోర్వలేక పరువెత్తిపోయిన మనలో
మకేశస్వామివారే వచ్చి వసుంధరునిం గాంచె.

వసు:—ఓహో! లోమకేశరాజా! నీవెందుకిట్లు పర్వెత్తిపో
వుచున్నావు? బ్రాహ్మణులు భువనమోహినిదేవాలయం
బునం దున్నవారా? మఱల వారల కేమియు విపత్తు తటస్థిం
చలేదుగదా?

లో:—అయ్యా వారందఱు క్షేమముగానే యుండిరి. యాచోరు
లరుదెంచి భువనమోహిని నెత్తికొనిపోవుట కుపక్రమించు
చుండ నదాటున నే నచటి కరుదెంచితిని. వారలకును
నాకును గొంతసేపటికు సమరమయ్యె నొకని మూర్ఛనొం
దించితి. మిగతయిరువురు నాదెబ్బల కోర్వలేక పరువెత్తి
పోవుచున్నారు వారిం దరుముకొని వచ్చుచున్నాఁడ.

వసు:—ఎట్లు పర్వెత్తిరి? యేదిశగాఁ బోవుచున్నారు?

లో:—ఇదో యీపశ్చిమోత్తర దిశయందుగల పెద్దపర్వత
పఙ్క్తులఁ డాఁగికొనుటకై పోవుచున్నారు. శీఘ్రముగా

నేను బోనలయు నిపుడు మాటలాడుట కవకాశము లేదని
పర్వెత్తుచుండె.

వసుం:—అట్లయిన వారెవ్వరు నీవొకఁడవు. వారిచేఁజిక్కిన
నీకేమివిపత్తు తటస్థించునో యిదో నేనును జనుదెంచెద.

అని యాతనివెంట ధనుఃఖడ్గాదులు సవరించుకొనుచుఁ
బర్వెత్తుచుండ నాతఁ డడుగిడినపుడంతయు భూమి గడగడవడఁ
కుచుండె. మార్గమునందుగల సన్న సన్న పాషాణములన్నియుఁ
జూర్ణములై పోవుచుండె. నాతనియూరు వేగముచేఁ బార్శ్వ
మునందు గల వృక్షములు పెళపెళధ్వనులచే విఱుగుచుండె.
నాధ్వని కపుడపుడు వెనుకంజూచి దిగులొందుచు నాప
ర్వతములలోనికిఁ బ్రవేశించె. వసుంధరుఁ డాతనివెన్నంటి పరు
గిడుచు "నాకాంతను దేవాలయముచెంతనునిచి నీవు రక్షించు
చుండుమను బేతాళునికి నాజనితభీతినిఁ గదా యతం డేమఱియుం
డునా? లేకున్న మరల నీకెవిపత్తు తటస్థించుట కేమియాస్ప
దముగలదు? ఎంతమాత్రత్వముండినను దేవతలు రాజసముగల
వారు. పూర్తిగాఁ గంటిగతమగువఱకు వారు రక్షించుటకుఁ
బ్రయత్నింపరు. అది యొకదుర్గుణము వారియందు గలదు. కా
నిము. నామనోశ్లాఘన మొనర్చియున్న బేతాళుఁ డెట్లు నా
ప్రశ్నలకు జవాబొసంగునో చూచెద. సత్రముతకలిగి యపరాధ
ము నొప్పుకొని క్షమాపణ వేడుకున్న సరి. లేనంతట ఖేందాభై
రవనిర్మూలనాభీలంబగుశర మిదే నీ కెదురుచూచుచున్నదని
చెప్పెద. వాఁడెవఁడైననేమి" యనుచు రోష మంతకంతకు క
నుగొనలం దోఁపించుచుండ పెట్టియెత్తినివానివలె నాతనివెను

కం బఱ్విడుచుండ లోమకేశుండు పఱ్వెత్తుచు నదే యటు వోవు
చున్నారని మఱల నొకసన్నగుట్ట నెక్కి చూచి యిదే యాలో
యలోనికి దిగుట కుపక్రమించుచున్నారని మఱియొకప్రక్క
దారిదీసి వడివడిగాఁ బోవుచుండెను. మనవసుంధరుఁ డాతని
వెంటఁ బఱ్విడుచుండెనుగాని చోరు లెందుఁ బోవుచున్నది పరికింప
లేఁడు. అతం డామార్గముగాఁ బఱ్వెత్తి పఱ్వెత్తి,

ఉ. పాటునీరంధ్రకబాకభృంగభీషము విస్తృతాస్థితృప్తవ్యాళముల్
యటవీసంచరితాట్టహాసగజఘీంకారారావాఢ్యముల్
కీశసంఘోత్కటఘూత్కరధ్వనిఘటాక్రూరంబునై వానరీ
పటలీసంశ్లేషఘోరకంటకయుతం బా గహ్వరంబుం గనెన్.

"అదే చూడుము మహాత్మా! లోయలో దిగుచున్న వా
రు యీశిలారోహణ మొనర్చినఁ జక్కగా నగపడుదురని తా
నాశిల నెక్కి చూడుము చూడుము త్వరపడుము. నీబాణజ్వా
లచేఁ జూర్ణంబు గావింపు" మని త్వరపెట్టిన నమ్మహాత్మునకు
వారగపడకున్న నామహోన్నతశిల నధిష్ఠించెను. లోమకేశుం
"డదే యా చెట్లచాటున నున్నవారు చూడు మిదే యాపొద
రింటిదాపున కిపుడు బోవుచున్నారు చూడు మిపు డొకబండ
పైనఁ గూర్చున్నారు చూడు" మని చెప్పుచుండ వసుంధరుం
డామహోన్నతశిలనుండి తొంగితొంగి చూచుచుండెను. లోమకే
శుం డొక్కయేటున రెండు చేతులం బట్టి యాభయంకరమైన జర
తలోని కమ్మహాపురుషునిం ద్రోబ్బె. "హా! పరమపురుషా!"
యని లోయలోనం బడియె.

"పోమ్ము చాపము. పీడవిడిన దిక భువనమోహిని నా
కుఁ గరతలామలకము గదా? యాతఁ డుండెనేని భువనమోహిని

చ్చటి కెపుడు వచ్చితివి? భూసురలను విడనాడి యొంటరివై యున్న దానవే. రమణీ! స్వప్నమున భర్తగా వరించితినని నీవన్న రీతి నిపు డొంటరివై యీవనదేవతాసమక్షమున గాంధర్వ విధిగా నన్ను వరింపుము. మందహాసవదనముచేఁ బ్రసన్నదృష్టిం గాంచి మృదుమధురసుధారసలోలుక నొక పలుకు పలుకుము. ఎన్ని దినములనుండియో నీయాలింగనసౌఖ్యం బభిలషించుచు న్న నన్నుఁ గరుణింపరాదా? దేవీ! నీచరణసేవకుఁడనై యుం డెద. నీమధురాధరసుధారసంబిమ్ము. నీ నవమధ్యవిరాజితంబగు వళిత్రభంగరేఖలు నావక్షముపై ముద్రింపుము." అని విభ్రాంతుఁడై పలుకుచున్న యతనిం గని "దేవా! యిదివఱకు నీపైన నున్న దంతయుఁ బ్రణయకోపమే గాని యత్యాగ్రహముగాదు. ఈనూతనపురుషుఁడైన వసుంధరుని వరియింపవలెనని యుంటి నది యుక్తముగాఁ దోఁచలేదు. కళాభానుఁడు నామావశిష్టుఁ డయ్యె. నిన్న దేవాలయములో నేఁ జెప్పినరీతి నాస్వప్నములో నిన్ను వరించియుంటి నది నిక్కమైనవిధి. స్వప్నమునం దొనర్చు కొన్న యాయలంకారము లిపుడు నాయందు గనఁబడుచున్నవి. యోచింపఁగా మనకిద్దఱకుఁ బ్రేమానుబంధరూపమగు నీ త్రాడు త్రెంచినను దెగక యున్నది. కానఁ బ్రేమలతాబంధనము చే నిన్నుఁ గట్టివైచెద. అనంగకదనమున నిన్ను హతము గావించెద. మోహాస్త్రాకరాళవదనముచే నిన్నుఁ గబళించెద. గాంధర్వ రూపకముననో పైశాచికరూపకముననో నీదేహగ్రహణంబాచరించెద. ఈయరణ్యము నూతనవధూవరులు సంచరింప యోగ్యమైనది కాదు. మనము త్వరగా నిందుండి వెడలుద మిపుడే. నీవొక పిశాచమువలె నాకంటఁ గనఁబడుచున్నవాఁడవు. నాకొఱ

కింతటియవస్థపడుచున్నాఁడనని నీనిమిత్తమే యాబ్రాహ్మణుల
మొఱఁగించి యొంటిరినై యెదురుచూచుచున్నాను. ఇంకనుండిన
నింక విశేషము లేమితటస్థింపనో" యనిన సోమకేశునకు సం
తోషము మించి దేహముపైఁ బ్రజ్ఞలేక "దేవీ! నీకీనాఁటికి నా
పైన దయగలిగెగదా" యని మఱల భువనమోహినిం గాంచె.
తలపాగా సరిగ మఱలమఱల సవరించె ఖడ్గమును జేతినుండి వద
ల్చి వరలోనుంచుకొనియె. మెల్లమెల్లన రాగంబులు దీయఁదొడఁ
గె. నిజకరములచే రెండుతొడలపై మృదంగధ్వనులం దాటించె.
నిట్లువికారపుచేష్టలుచేయుచున్న సోమకేశుంగని "ప్రాణేశ్వరా!
యిఁక వెన్నెద మహావృక్షశాఖయం దొక పరిపక్వఫలముగలదు.
చిలుక కొఱికిన దొసంగవలయుఁ దెచ్చియి"మ్మనిన నది యెం
తపని యని సోమకేశుఁ డా చెట్టునెక్కి కొంతపెట్టికి "యిదిగో
ఫలము దిగువఁబడిన నలఁగిపోవును. వడిఁ బట్టుము వైచెద"
ననియె. "నాథా! నదియందులకునోరు దెఱచెద. నోటనె వ్రేక
వేయుము. నిలుక్యశుద్ధి కనుఁగొంప" మని నోరుదెఱచి కరాళ
దంష్ట్రలతో భయంకరజ్వాలలతో అఘోరవదనముతో నొక
పెద్దపిశాచముకైవఁ గాన్పించె. నదిగని "అయ్యో! భూతము
భూత"మని యఱచుచు నాతఁడగరి మామిడినుండి దబ్బున దిగు
వఁబడియె. నంతఁ జే నాతనిసంధబాధములన్నియు సడలె. నది
గాంచి "ప్రాణేశ్వరా! యెందుకింతటిభయమొంది కేకవేసితిరి.
నే నిందేయుండఁగా మీకేమిభయము? అయ్యో! యిది
పాడరణ్యము. ఇచ్చోటువిడిచి పోవక పాపిమామిడిపండునకై
మీకింత శ్రమము గలిగించితి. ప్రాణేశ్వరా! అయ్యో! నేనెం
తన్నను సౌఖ్యమే తటస్థించుచున్నదే" యని దేహము విడిచె.

మన్మథమోహినీ దేవతలం బోలు నా దేవేరు లిపుడు పుత్రికావియోగంబుచే శోకదేవతలంబలె గాన్పించుచుండిరి. వారిదివఱ కేమిగతి బట్టియున్నవారో వెదకుటకై చనిన దుశ్శీలాదులు రాక తడసిరి. యెందుఁగన్న నగపడలేదని సైన్యాధిపతి వచ్చెె. పదిదినములనుండియు వెదకి వెదకి వృథాప్రయాసఁ జెందుచున్నాను యేమిసేయుదునని యేడ్చుచు నొకపురుషుఁ డొక్కగుఱ్ఱముపై నధిష్ఠించి కత్తిఁబట్టుకొని హిమాలయారణ్యములలో వచ్చుచుండ నాతని కేదియో ధ్వని వినుపించె. వెనుకం దిరిగిచూడ నొకపురుషుఁ డరుదెంచుచుండె. నతనికి నలుబదియైదు సం॥లు వయస్సు మీఱియుండె. గనుబొమ లెపుడును ముడివైచుకొని యుండుటచే నతఁడు సహజక్రూరస్వభావుఁడని చెప్పక చెప్పుచుండును. ఆతఁడు గొప్పయింటితనముగలవాఁడని దుస్తులవలనను ముఖలక్షణముల వలనను యాభరణములవలనను దెలియుచుండె. ఆతని నేత్రము లెఱ్ఱవారియుండుటచేతను నడుమనపుడు తొట్రిలుచు నూఁగాడుటచేతను మద్యపానమదోన్మత్తుఁడని దోఁచుచుండు నాపురుషునిఁ జూచినంతనె మన యశ్వారోహకుఁడు గుఱ్ఱమునుండి దబ్బునదుమికి "తమ్ముఁడా దుశ్శీలా! నీయన్వేషణము వృథయేనా? లేక యెందైనను నాపుత్రిక యగపడెనో చెప్పుమని యడిగె.

దుశ్శీ:— రాజేంద్రా! నాఁడు మీతో విన్నవించుకొని భువనమోహినిని వెదకుటకై వెడలినది మొదలు లీవఱకు నెన్నియో పర్వతములఁ జూచితి. వనాలు పరికించితి. సరోవరములు గాంచితి. గుహాలు పరిశీలించితి. లతాగృహములఁ బరీక్షించితి వృథయయ్యె. ఆమె భూమియందున్నదను

మాట వదలవలసినదే. నేను నిరాశ చేసికొన్నాను. మీమనం బెట్లున్నదో నేఁ జెప్పఁజాల.

విభా:—శేషమ్ముఁడా! నే నూరు వెడలునప్పుడమోఘమైన శుభసూచకము లగపడియె. ఇంకను నాకూఁతురు జీవవంతురాలై యున్నదనుకొన్నాను. వెదకవలయు నింతటితో చాలించుకొనుట తగనిపని. శంబరవర్మయులూకసేను లెందెందు వెదకుచున్నారో పాపము.

దుర్మ్య:—లేదు లేదు. నాఁడు సన్నసాయంతనమున నుత్తరదిశ నుండి చనుదెంచిరి. యెందు నగపడలేదని చెప్పి యిందెచటనో యొకపాడుదేవాలయము గలదనియు చూచివచ్చెదమనియు పోయియున్నవారింతవఱకు రాలేదు.

విభా:—ఇంతటిక్రూరకార్యమొనర్చిన దురాత్ము లెవ్వరో వారెందరిగిరో తెలియలేదుగదా?

దుర్మ్య:—ఈయడవిలో ముగ్గురుపురుషు లప్పుడప్పు డొక్కొక్కచోట గూర్చొనుచుండుటయు మేము గన్నప్పుడు మరుగుపడుటయు తటస్థించుచున్నది. ఆదురాత్ములే కార్యమొనర్చియుందురని సందేహించుచున్నాను.

విభా:—చోరులామె నెత్తుకొనివచ్చి యేమొనర్చి యుందురు?

దు:—చంపి సొత్తులు గైకొనియుందురు.

విభా:—జగన్మోహనావతారముచేనున్న నాపుత్రికను జంపుట కెంతటికఠినుండైనను బ్రయత్నింపఁడు. సొత్తులపై నాశగలవారు సొత్తు లపహరించి యామె నింకెక్కడనైనా విడిచి పోయియుందురు.

ద:—ఆశ బలీయమైయున్నప్పుడు సౌందర్యమును బాంధవ్యమును లెక్కింతురా? చంపియే యుందురు. చంపకుండిరేని ప్రపంచమున నున్నప్పుడెప్పుడైనను గుర్తించి తగుశిక్షలకు గురియొనర్తురని దుష్కార్యములు చేసియేయుందురు.

విభా:—సుకుమారులు నిన్న సాయంతనమునందు ఇందేదియో దేవాలయమున్నది చూచివచ్చెదమని పోయినారని చెప్పితివే, అచ్చటికి మనమును వెళ్ళి చూచివత్తము రమ్ము.

దు:—మాబిడ్డలను గొంపోయినవారివలె నీయడవిలో వెదకి వెదకి విసుకుజనియించినది. మన అదృష్టవశమున భువనమోహిని యగపడెనేని నీకోర్కెప్రకారము మా భువనమోహిని నీకుమారునకొసంగి యర్ధరాజ్యమొసంగుదుము. నీకు పుత్రులులేరు. నీకెన్ని సారులు చెప్పినను మనసుకు రాకున్నది. పుత్రులులేనివారికి పున్నామనరకము దరియించుటకువీలుండదు. నారెండవకొమారుని దత్తు తీసుకొనుము. మిగతయర్ధరాజ్యమతనికొసంగుము. వంశానుగతమైన మనరాజ్యము నితరులపాలొనర్చుట ధర్మమగునే యోచింపుము.

విశ్వా:—సాధ్వీలా! నాకేమియు తోఁచదు. నాపూర్వపుణ్యఫలవిశేషముచే నాకూఁతురగపడెనేని నీసుతుని దత్తుతీసికొనినను దీసికొనకున్నను అర్ధరాజ్యము నీకొసంగుదును. మీరుమాత్రము రాజ్యార్హులుగారా?

అని మాటలాడుచు దేవాలయసమీపమునకుం జనిరంత రాజు భువనమోహినీ యని యఱచె. లోపలనున్న బ్రాహ్మణులును భువనమోహినియు పరువెత్తుకొనివచ్చిరి. యామెను గన్న మాత్రముననే విభావసుఁడుగుఱ్ఱమునటువదలి "అమ్మాయీ నాతల్లీ! ప్రాణములతో నున్నదానవా" యనిదబ్బుకొని యేడ్చె. "తండ్రీ! మిమ్ముఁ గనుభాగ్యము గంటిని. మాతల్లి యెంత దుఃఖించుచున్నదో" యని భువనమోహినియు దుఃఖించె. నంత శాస్త్రులుఁ డామెనుగాంచి "కూఁతురా! మాపుణ్యవశమున నిన్ను గనుభాగ్యము గంటిమి. చోరులచేఁ జిక్కినది మొదలు ఇదివఱకు నీనిమిత్తమే నేనును మాశంబరవర్మయు నులూకసేనుఁడును దిరిగితిరిగి యవస్థపడుచున్నవారము. నేఁటికి మాయవస్థలన్నియుఁ గట్టెక్కిన"వనిన "పిన్నప్పా! నానిమిత్తమై మీరెంతకష్టపడితిరో మాయన్నగారెందెందు వెదకుచున్నారో మీరొనర్చినసహాయమునకు మీకు మేలుచేయవలెనని భగవంతునిఁ గోరుచుండెద. మాయన్నగారెందుఁబోయినది తెలియునుగదా?

శా:—నిన్న సాయంత్రముననే వారీదేవాలయము చెంత నెవరోగలరు చూచి వచ్చెదమని యిటకు వచ్చిరి. మఱల వారీవఱకు నా చెంతకు రాలేదు.

భు:—నిన్న సాయంతనమున నిచ్చటికి మాయన్నగారు రాలేదు. ఆచోరులు మువ్వురరుదెంచి యుండిరి లోమకేశుఁడు వారిం దరుముకొని యొకని మూర్ఛనొందించె. మఱియొకనితాపులకోర్వలేక పరువెత్తె. నీబ్రాహ్మణులు నేనును నన్ను బట్టుకొనియున్న మఱియొకచోరుని లోమకేశు

నిచే మూర్ఛనొందినవానినిబట్టి కాలుచేతులు బంధించి పాడుగుంతలలో ద్రొబ్బి వచ్చియున్నవారము.

విభావ:—వారున్న చోటు యిచటికెంతదూరముగలదు? యిప్పుడేపోయి చూచిరావలయు ననిన వారందఱు సమ్మతించి యచ్చోటికిం బోయి చూడ నచ్చట నెవ్వరును లేకుండిరి. అందుల కా బ్రాహ్మణులు యోచించి సరిసరి లోమకేశుం డదను కొనిపోయిన మఱియొకచోటుండే వీరికట్లువిప్పి తప్పించుకొని పోయియుందురనిరి ఆ వేళలకు మంత్రులాదులు [illegible] జరిగియుండునని యనుకొనిరి. దేవాలయము చెంతకరుదెంచి యొకచో నుపవిష్టులై వారిందఱు నీరీతి ప్రసంగము గావించిరి.

మంత్రి:—అన్నా! మనమనుకొన్నరీతి భువనమోహిని లభించినది యిది సంతోషకాలము. మన భువనమోహినివివాహమును విజయదత్తపుత్త్రుని రాజ్యాభిషేకము నొనర్చుటకు మీయభిప్రాయమేమి?

విభా:—మంత్రులారా! తొందరపడియెదవేల? [illegible]దినమున కుంజరవిహారవనెగారికి భువనమోహిని నొసంగి వారును నన్ను సమ్మతియొనర్చి యావల శుభముహూర్తము పొందుపఱచి రెండుకార్యము లొకకేసారి యొనర్పవలయు నింతకు మనయులూకసేనుఁడు రాలేదు. లోమకేశుఁ డెచటికో పాఱిపోయియున్నాఁడు.

భువ:—అప్పా! మాపినతండ్రిగారు నానిమిత్తమై బహుప్రయాసపడియున్నవారు. మాయన్నగారు. నట్లే యీయరణ్య

ముతో దిరిగితిరిగి తుదకు దమయిష్టము నెఱవేఱక ప్ర
యాసపడుచున్నవారు. ఇపుడు వారందఱియిష్టము సఫల
మగునట్లు నేను లభించియున్నాను. వారలం బిలిపించి యు
గ్రాక్షసేనుని పేరు దత్తుతీసికొని మీవాక్యానుసారం
బర్ధరాజ్యము పట్టాభిషేకమొనర్పుఁడు. మిగతయర్ధరాజ్య
ము మాకుంజీవనంబాలు. వారియిష్టమునకు వేఱుగా యో
చింపఁగూడదు.

విభా:— మీయందఱియిష్ట మట్లున్నపుడు నాకును సమ్మ
తమే యనునంతలో శంబరవర్మ యుగ్రాక్షసేనుతో వచ్చిరి.
వారింగాంచి "నాయకులారా! నానిమిత్తమై మీరెంతయో
బాధపడియున్నారు. మీచెలెలినాఁడు తటసించినది
యిదో చూడుఁడు మీచెలెలి" యనియె.

ఆమాటవిన్నంతనే వారు సంతోషముచే "చెల్లెలా
భువనమోహినీ! నీనిమిత్తమెంతొ ప్రయాసపడి యున్నవారము. వా
నివినాఁడు లభించుట మాకు ముల్లోకాధిపత్యము లభించినట్లు
న్నది. తల్లీ! మాకిష్టములన్నియు నెఱవేఱె" ననిరి. విభావసు
రాజు బ్రాహ్మణులఁ గాంచి "రాజ్యాభిషేకమునకును దత్తస్వీకా
రపుత్రపట్టాభిషేకంబులకును వివాహమునకును దగుశుభముహూ
ర్తము నిర్ణయింపుఁడు. మాభువనమోహిని లభించినసంతోష
కాలమగుటచే నీయరణ్యముననే యీవనదేవతాసముఖముననే
యగ్నిసాక్షిగా నన్నికార్యములొనరించి యీవల గృహ
మునకుం బోవలయు" ననిన నాబ్రాహ్మణులకేమియుందోఁపక
యోచించి "యిది యాశ్వీజమాసముగదా రాజ్యాభిషేకాదు

శ్రీశుద్ధదశమియందు శుభప్రదముగుటచే నిశ్చయింపుఁడు. వలయుపదార్థములు శాస్త్రయుక్తమగుయాగవిధానప్రకారము సేకరింపుఁ"డని విమర్శచేసిరి. దర్శకులు నా పదార్థములు సమకూర్చుటకు సమ్మతించి. "నేఁడు నవమిగదా రేపు తెల్లవారి సర్వసామగ్రులతో నందఱు నీదేవాలయముచెంతఁ జేరవలయు" నని యనుకొనిరి. దర్శకులందఱు సామగ్రి సమకూర్చుటకై వెడలె. నపుడు సుబ్రహ్మణ్యశర్మ సూర్యనారాయణశాస్త్రిగారు భువనమోహిని సంతోషమున కాశ్చర్యము వహించి రాజునకుఁ బ్రసంగించిరి

సుబ్ర:—రాజేంద్రా! పురమునకుఁ బోయి దేవేరులకు మన సందేశము పంపుచు మీయిష్టప్రకారము శుభకార్యము లొనర్పఁగూడదా యింతలో నింతయాతురమేమి?

రాజు:—మాభువనమోహిని లభించె నా కదియే సంతోషము. అర్థరాజ్యమేగాదు నాప్రాణములిమ్మన్నను నోసంగెద నింకేమడిగిన నిచ్చెద. ఎట్టులయిననేమి మాభువనమోహిని యిష్టపడియున్నది. ఆమెమనస్సంతోషముగా నుండుటయే నాకుఁ గావలయు.

సూర్య:—చోరులచేనపహరింపఁబడినపుడును క్షేంకాభైరవునిచే వధింపఁబడుచున్నప్పుడును రక్షించిన యమ్మహాపురుషుఁడు రావలదా? మీకష్టమువచ్చినవారికొసఁగుఁడు. అందులకు మాయపేక్షణ యేమియు లేదు. అమ్మహాత్ముఁడు రక్షించుటవలనఁగదా మీకూఁతురు మీకు లభ్యమగుట? లేకున్న మీరింతటిసంతోష మనుభవించుచుంటిరా?

రాజు:—ఆపత్కాలమందు రక్షించుట ప్రపంచమునందు జన్మించినవారందఱికి సహజధర్మమేగదా? అదియొకవె క్కసమని యుద్ఘాటించి జరిగెడి కార్యములను వారికొఱకై నిలిపివేయుటకు సాధ్యమగునా? అమ్మహనీయుఁడు నాసుత ను రక్షించినందులకు నేనును బుత్రికయుఁ గృతజ్ఞులై యుందుము. "శుభస్య శీఘ్రము" మనుదురుగాన యనుకొన్న కార్యము లతిత్వరలో జరుగవలసినవే.

సుబ్ర:—ఓయమ్మాయి! యిందులకు నీవును సమ్మతించితివా? లోమకేశునే వరియింపవలెనని నిశ్చయించుకొంటివా?

భువ:—నేను స్వప్నములో వరించియున్నానని యిదివఱకే విన్నవించుకొన్నాను. మాపితరుల యిష్ట మట్లనే యున్నది. నే నన్యథా యోచించుట తగనిపని. మాతండ్రిగారి కేది సమ్మతమో నేను నదియే సమ్మతించుచున్నాను.

సూ:—నీవైన నమ్మహాత్ముఁ డరుదెంచునపుడు నిదానించుట మంచిదనకపోయితి వింతశీఘ్రమున నాతని మఱచిపోవుట తగదని మేమనుకొన్నాము.

భు:— ఆవసుంధరుం డరుదెంచిన మాచే గౌరవింపఁబడును. నావివాహమున కాతఁడుండియే తీరవలయు ననునంతటిసంబంధ మేమి?

సు:—ఆనాఁడు లోమకేశు నంతగా దిరస్కరించి యింతశీఘ్రముగా మఱల నాతనినే వరియించితివి. నీబుద్ధి శుద్ధబాల్య చాపల్యంబున నున్నదని దృఢపఱచుచున్నది.

భు:—స్వామీ! మీరిట్లు నన్నధిక్షేపింపఁగూడదు. సూక్ష్మ

మొఱింగి యూరకుండవలయు. స్త్రీ లతిచపలులనుమాట మీరు వినినదేగదా! అనాఁడావిధముగా మనసుండె. నేఁ డీవిధముగా మాఱియున్నది. మనసు నష్టపెట్టువా రెవ్వరు? జ్ఞానము కలుగవలయు. సట్టిజ్ఞానధారణాశక్తి నాకు జాల దందుచే మాతండ్రిగారియిష్టమునే నెఱవేర్పవలయు ననుకొని యున్నదాన నీకర్మోపాసకుఁడు మాతండ్రిగారికి కోపమువచ్చును.

సు:—మీయిష్టము మాకెందు కాభ్రమత? మీసుశీలా శ్రీపాదులగతి యేమియ్యెనో యని యనుకొనుచున్నంతలో వెలుపలనుండి,

"క. శీలాచారసుశీలా, బాలా బాలేందుఫాల పలుక వదేలా
యేలాగైతివో గద నా, మాలిమి నీడకను జూచి మయిలలలలనా."

అనివినుపించె. బ్రాహ్మణు లిరువురు తటాలున లేచి బైటకరుదెంచి చూడ మన శ్రీపాదుఁడును, విశ్వావసుండు నగపడిరి. వారలం గన్నమాత్రముననే సంతోషపరవశులై మైమఱచి "నాయనా! శ్రీపాదా! ప్రాణములతో నున్నవాఁడ నా నాతండ్రీ! నేఁడు నాపూర్వపుణ్యవశమున నిన్నుమరలఁ గనుగొంటిని" అని యాలింగనము చేసుకొని యానందబాష్పములు రాలుచుండ నిర్బుద్ధుఁడై కొంతెదడ పట్లనే సూర్యనారాయణశాస్త్రి నిలచియుండె. శ్రీపాదుఁడు విశ్వావసుఁడును బ్రహ్మణ్యశర్మకు నమస్కరించి నిలచిరి. "నాయనా శ్రీపాదా! నా కూఁతురు సుశీల నీకగపడలేదా? ఆమెసంగతి నీవేమైనఁ దెలిసికొనియున్నావా? నీవృత్తాంతమేమి? విశ్వావసుం డరుదెంచి

యున్న నాఁడు నాగరికయీవిధమైనది.” “బావా! నీవెందుండి చనుదెంచితివి? నీ మేనగోడలిసమాచారము నీకేమైనఁ దెలిసెనా? తుదకు నాగతి యిట్లయ్యె” నని సుబ్రహ్మణ్యశర్మ యేడ్చె. బావమఱఁదు లిరువురు నొకరినొకరు దబ్బుకొని యేడ్చిరంత శ్రీపాదునింగాంచి “నాయనా! నీకథనంతయు భువనమోహినీదేవివలన వింటిని. సుశీలవృత్తాంతమేమైనఁ దెలిసియుండినఁ జెప్పు” మనియె. నంతట భావసుఁడు “బావా! మనసుశీల కాశీనగరమునందుండె. నేనె దోడ్కొనివచ్చి ప్రయాగయందు మాయక్కగారియొద్ద విడిచితి. నామె సుఖముగానుండె. మూఁడవదినమున నందఱు నిద్రించుచుండఁగా మఱల కనఁబడకున్న దది యేమిమాయయో యావృత్తాంతమెఱింగి యీ శ్రీపాదుఁడు ప్రయాగ కరుదెంచె. నాకాఁ గనఁబడలేదని మేము యోచించుచుండఁ నిప్పటికిఁ దెలియఁజేసితి మిపుడే యీదేవాలయము చెంత కరుగవలయునని ప్రయాణమయ్యె. నొంటిగా విడువుట కాఁగ లేదని నేను నీతని వెంటఁ జనుదెంచితి. నిదియే

[illegible]” యనిన సుబ్రహ్మణ్యశర్మ [illegible] మైన భువనమోహినీదేవి యాతనింగాంచి “స్వామీ! [illegible]కుఁడు. ఆదురాత్ముఁడైన శోండాభైరవుఁడు నిర్యాణమైయున్నవాఁ డింక నట్టి క్రూరకార్యము లొనర్చువా రెవ్వరునుండరు? ఆమె యెందుండినను సుఖపడుచుండును. గష్టకాలము కడచినది. కాఁగల కార్యములు కాకమానవు. మీరు విద్వాంసులైయుండియు నిట్లు చింతించిన లాభముండదు. అన్నియు భగవంతుని యాజ్ఞానుసారమే జరుగును యూరకుండుఁ” డని యూరడఁబలుక్క చుండఁగాఁ దెల్లవారెను. జగద్బాంధవుఁ డఖండతేజఃప్రభాపటలి

చే బ్రహ్మాండమంతయు నిండుకొనిన యంధకారము నశింపం
జేయుచుండె. యాజ్ఞికమునకు వలయు సంబారములు సమకూ
ర్చుకొని ఋత్విజులు నింబగవర్మ యుల్లాకసేనాగులు హేమకేశుం
దోడ్కొని వచ్చుచుండిరి రాజు వారలం గాంచె. హేమకే
శుండు ఖిన్నుండై తలవాల్చియుండె కారణంబెయ్యది యని
విచారింప ఋత్విజులు చెప్పిరి.

“రాజేంద్రా! మేమీ సామగ్రి సవరించుకొని వచ్చు
చుండ సింహద్వారమాని కొమ్మకు వ్రేలఁదీయఁబడి యేడ్చుచు
నుండె మేమిద్దాని గాంచి కట్లువిప్పి కొమ్మనుండి దించుకొని
యితనినెక్క నింతవిచారించినను చెప్పఁడయ్యె. మీచెంతకు
దోడ్కొని వచ్చియున్నాము. విచారింపవలయు” ననిన యాత
ని దీనదశం గాంచి రాజు పరితాపముచే “హేమకేశా! యెం
దుకిట్లు ఖిన్నుఁడవై యున్నవాఁడవు? నిన్నిట్లు వ్రేలఁదీసినవా
రెవ”రనిన రాజునకు నమస్కరించి తననిజస్థితిని జెప్పుటకు
నేమేమి యో యోచించి “స్వామీ! మనభువనమోహినీ మొద
లాగు కులగు దొంగలు నిన్న సాయంత్రమునందగపడుటచే వారి
లో నయ్యమొనర్చి వీరందఱియొక్కటనే యొకనిని మూర్ఛ
నొందించితి. మఱియొకని తాపుల కోర్వలేక పరువెత్తితి. నతం
డు నన్ను దరిమి పట్టుకొనెను. యోపినంతపోరాడి తుదకు
వానిచేఁ జిక్కితి నన్ను కాలుచేతులు బంధించి మ్రానికొమ్మకు
వ్రేలఁదీసి వెడలిపోయె నప్పటినుండియు బాధనొంది తుదకు
ప్రాణనాళములలోని రక్తమంతయు కంఠగతమై యూపిరివిడు
చుటకు సిద్ధుఁడనైయుంటి నిపుడు వీరరుదెంచి నన్ను బాధవి
ముక్తునిజేసి మీయొద్ద కిచ్చినారని చెప్పిరి. నేనిట కరుదెంచితి”

